# నీరాజనము.

(ఖండ కావ్య సంపుటి)



రాయప్రోలు సుబ్బరామయ్య.

# పరిచయము

మొదటి మహా సంగ్రామ కాలములో తెలుగు దేశము నంతట నొక నూతన వికాసము వ్యక్తమయినది. అది ముందు శ్రీ రాయప్రోలు సుబ్బారావు కావ్యములలో గోచరించినది. తరువాత కవికుమారు లెందరో వెలసి యీ వికాసమును ప్రతిబింబింప జేసినారు. వారిలో దేశ కాలావధులు దాటిన యుత్తమకోటి నందుకొనిన కవితల్లజులు శ్రీయుతులు తల్లావఝ్ఝల శివశంకరులు, విశ్వనాధవారలు. ఆనాడు విరిసిన యీ కాంతి ప్రవాహ రూప మొంది బహుకాలము సాగినది. కాని యీ ప్రవాహము కొంత కాలముగా వెనుకడుగు వేయుచున్న లక్షణములు కనబడుచున్నవి. ఇంకను అది సజీవముగా నున్నదనుటకు మధ్య మధ్య తరంగ మొకటి సాగుచుండును. ఈ గ్రంధ మట్టి తరంగములలో నొకటి.

ఆధునిక కవుల కవమునకు బీజభూతము లైనవి జాతీయత. ఆంధ్రాభిమానము, ప్రకృతి సౌందర్యము. అవ్యక్తమైన యొకానొక ప్రేమానుభూతి - ఇవి యన్నియు నేతద్గ్రంధ కర్తయగు శ్రీ రాయప్రోలు సుబ్బరామ కవి కావ్యములలో ద్యోతమానము లగుచున్నవి. జాతీయత "శుభాకాంక్ష" వంటి కావ్యములందును, ఆంధ్రాభిమానము "నాడు-నేడు" "ఆంధ్రి మాత", "తెనాలికవి" ఇత్యాది కృతులందును; ప్రకృతి సౌందర్యానుభూతి "మనో వికృతి" ఇత్యాది కావ్యములందును భాసిల్లును- చూడుడు:

"నింగిని వ్రాయుచుండె రజనీముఖ వేళ గళార్థి యెవ్వడో
బంగరు కుంచెతో శబల వర్ణపు జిత్ర పటమ్ము: లప్పుడే

ముం గవిన్న భావము మనోగతమై మొగమావరించి తీ
రెం; గలమంచుకొంటి; గను తెప్పల నించుక మోడ్చినాడనుఁ."

ఆ కావ్యము లోననే కవి తాను గన్న ప్రణయశీల పరమైన తెంపు లేని నవ్వులో నాలు గశ్రు కణాలు గూడ ప్రదర్శించినాడు!

ఇందలి "స్వప్నోద్యానము" శ్రీ సుబ్బరాయ కవిశేఖరుని "స్వప్న కుమారము" ను దలపించును. ఈ కవి శివశంకరుల కృతులు పఠించి జీర్ణించుకొనినందులకు "రాధా ప్రసాదనము" సాక్ష్యము. కొంత విశ్వనాథ ప్రౌఢ వాక్సరణి నభ్యసించి నందులకు "కను తెప్పల నించుక మోడ్చినాడనుఁ" వంటి ప్రయోగములు తార్కాణములు. ఇట్టి యంశములు కవి వ్యుత్పత్తిని సూచించు చున్నవి.

కాని యీ కవి నలుబది యేండ్ల క్రిందట విజృంభించిన కవితా ప్రవాహమునకు జెందిన వాడైనను దాని కెదురు ప్రవాహము ప్రారంభించిన తర్వాతనే, కవిత్వమునకు దిగినవా డగుటచే దాని ప్రభావము కూడ నీ కవిపై బడినది. అది "కేశవస్వామి" వంటి కావ్యములలో వ్యక్తమగును.

"వెలుగు నొసగెడి వెలుగుల వెలుగు వంచు
నేను ననుకొంటి; బూజారి నీకె వెలుగు
దెచ్చు చుండుట గంటి

.... .... .... .... ....

"రేగు నట్టాకటం దూలు కృపణ జీవి
యూర్పు. రాపడి యున్న నిస్పృహ దేమి?"

అంతే కాదు. ఈతడు కలువు తాండవ మాడు రాయల
మ కవి. ఈ విశిష్టత "దుర్భిక్షము" వంటి కావ్యములలో ప్రతిబిం
బించు చున్నది.

"ఉర్వీ కృశాంగి నిట్టూర్పులో నాగను .... .... "

పాఠకులు స్వయముగా నీ ఖండ కావ్య మాలను చదివి
ఈ నవ కవికి స్వాగత మొసంగుదురు గాత!

రేపల్లె
నందన పుష్య బ॥౧౦ గురువారము

నోరి నరసింహ శాస్త్రి.
(కవి సమ్రాట్-సాహితీ సమితి
కార్యదర్శి)

## పండితాభిప్రాయములు

శ్రీమన్!

మీరు పంపిన నీరాజన మందుకొని భావించితిని. నా భా
వనము భావకులకు నివేదించుట భావ్యము. మీ రిచ్చినది నీరాజనము
నే నందించునది

### ఆరాత్రికము

నీరాజనమున నిరువది యైదు కావ్య భేదములు రెండు వం
దల పదునాలుగు వివిధ పద్యములు కలవు. అన్నియు కలియగా నిది

నీరాజన మైనది. ఆంధ్రమాత కిది నీరాజన మని కవి భావన. భిన్న విభిన్న కాలము లందలి నానా కృతు లీ యాకృతి కలిగి విశిష్ట కృతి య యినవి. అన్ని కృతుల కనుగతముగా నొక యను స్యూత భావ సూత్ర మును కవి భావింప దలంచ లేదు. ఇందున్న వాని నటునిటు భావింప వచ్చును. కవి ప్రకృత్యుపాసన శ్రద్ధలో ప్రతీకారాధన మనపహ్నుతము కాలేదు. కవితాసర్జనకై కవి యనంత పథమునుండి పొంద వలసిన చోదనము పొందెను. సమకాల భావము లనభీష్టములయిన ననుబంధించెను. పరిప్లుత కర్మకమయిన లోకము పోకడ లున్నవి. కాళ్ళున్న కతల పరిహాస పేశలత, మగ్న భావముల వ్యక్తీకృతి యిందున్నది. విశ్వ రంగస్థలి భావ సంచారము చేసిన కవి నవ కాలపు కలయికను కటాక్షించెను. అంతటితో నాగక శుభాకాంక్షతో కర్తవ్యము ప్రబోధించెను. దైశిక జాతీయోద్యమము నివ్వానివ్వల నుతించువారలకును జీవిత నిర్వేదము పరాఙ్ముఖత పలాయన బుద్ధి కలుగుచుండుటను కవి దాచ లేదు. భావకుల భాష ఉత్స్వప్నాయితము లగుచున్నవని వీరు గుర్తించిరి. ఇందలి సాహచర్య మొక ప్రబోధన గీతము. నాడు నేడు వ్యత్యాసము లంతట నున్నవి. నేడేమేని యాశించిన దంబము అడియాస యయి యుపాలంభ విషయ మగునా? కవి యంతయు భావించి, కళాచ్యుతి వలన దుర్భిక్షము కలుగునని అపుడు బాల మిత్రుడు శివ మిచ్చునని రాయప్రోలు సుబ్బరామకవి సంభావనము. కవికి వలసిన ప్రతిభా వ్యుత్పత్తు లిందు గోచరించును. అభ్యాసమును తోడు కాగా భావి పరిపాకము చక్కని సమ్మోద మిచ్చునని యాశింతును. భిన్న ప్రకృతులతో నిండిన లోకము భిన్నరీతులతో నిందున్నది. వారు వారు వాని వాని నందుకొని నానా ఖండములం దఖండ భావమును స్వీకరింపవలసి యున్నది. అందుకై యీ నీరాజనము. ఈ నీరాజన మిచ్చిన సుబ్బరా

మయ్యగారు విశిష్టకృతి రచింపగలరు. పరిసరము వారి కట్టి దోహద మిచ్చుట యుచితము.

ఎ.సి. కళాశాల,
గుంటూరు.
15-3-53

జమ్ములమడక మాధవరాయ శర్మ.
(సాహిత్యాచార్య, లాక్షణిక శిరోమణి,
శాస్త్ర విశారద)

శ్రీ హయగ్రీవాయ నమః

చిరంజీవికి.

తాము పంపిన "నీరాజన" మను భవదీయ ఖండకావ్య సంపుటిని బఠించి పరమానంద భరితుడ నైతిని. పలు విషయముల తమ భావనా బలమును జాటుచు, ధారాళమగు ధారయు సరస శైలియు మృదు మధుర పద గుంభనము గలిగి యనవద్యమై యౌచితీమంతము లగు నభినవాశయములతో నలరారు తమ కృతి సహృదయులకు సద్యః పర నిర్వృతిని సమకూర్చు ననుటలో సందియము లేదు. నవ్యాంధ్ర కవితేందిరా రామణీయకముల నారయ దమ "నీరాజనము" మాణిక్య నీరాజనము వోలె సారస్వతోపాసకుల హృదయ పారితోషికముల బడయ గలదని నా పరమ విశ్వాసము. ఇట్టి యుత్తమ కావ్యముల నింకను బెక్కింటిని వ్రాయ దమకు భగవాను డాయురారోగ్య ప్రతిభా బలాదుల ననుగ్రహించు గాత!

గుంటూరు,
18-3-1953

పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు,
(మహోపాధ్యాయ, కవి శేఖర, శతావధాని)

.... .... .... మీ "నీరాజనము" అందుకున్నాను. ఈ ఖండకావ్య సంపుటియందలి పంచవింశతి దీపికలూ వెలుగులు చిమ్ముతూ తెలుగు భాషను దేదీప్యమానం చేస్తున్నవి. శశిరేఖ, రాధాప్రసాదనము నన్ను ఎక్కువగా ఆకర్షించాయి. మీ పలుకుబడిలో సొగసు ఉన్నది. బిగువు ఉన్నది. నవ్యత ఉన్నది. మీ సువర్ణ లేఖిని ఆంధ్ర భారతికి అర్పించిన ఆనంద నీరాజనమే మీ నీరాజనము. ఓజోవంతమూ తేజోవంతమూ ఐన మీ కవిత్వం తెలుగు సీమకు ప్రేమపాత్రం ఔతుందని ఆశిస్తున్నాను.

మీ
"కరుణ శ్రీ"

## సవరణ

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 8 | చోట్ల మృతంపు | చో ట్లమృతంపు |
| 6 | 15 | నన వధానత | ననవధానత |
| 6 | 15 | విగ్ర | విగ్రహ |
| 12 | 16 | మర్యాదవతిౕ | మాంగల్యవతిౕ |
| 15 | 6 | జూపవలె | చూపవలె |
| 18 | 7 | హంతకున కొసంగి | హంతకును నొసంగి |
| 24 | 1 | కొలంకులౕ | కెలంకులౕ |
| 27 | 16 | విలయాంధ్యమై | విలయాంధమై |
| 39 | 3 | నదా! | నమ్మెదా! |

# అంకితము

## కీ॥ శే॥ శ్రీ జుంకె వేంకట రెడ్డి గారికి

శ్రీ కమనీయ మైన ముఖసీమ వినూత్న గభీర భావముల్
ప్రాక - విశాల ఫాలమున బర్వెడు రేఖ లఖండ కార్య దీ
క్షా కుశలుండవన్న సడిసన్న విధానము నుగ్గడింప - అ
న్నా॥ కనిపించు చుండెదవు నాకము నుండి సుధా స్వరూపివై.

నీదు ప్రసన్న వినిర్మల వదనంబు
పిల పిల పండు వెన్నెలలు గాసె.
నీ నోట వచ్చు మానిత మంజు వాక్యమ్ము
లమృతాభిషేచనం బాచరించె.
నీ కంఠ పాళిలో నినదించు శబ్దమ్ము
దిక్కుల నాగి ప్రతిధ్వనించె.
నీదు నెన్నడలోన నిల్చిన పెను ఠీవి
గౌరవ స్థానంబు గాంచి మించె.
నాటి భౌతికాకార మీనాడు గూడ
కన్నులం గట్టినట్లున్నదన్న! నీ క
రమ్ము చలువ లో గొన్నవారలు ప్రసిద్ధ
కథకులై రిప్డు నీ గుణ గణము నెన్న!

నీలో నీవొక నవ్య నవ్వెదపు! దానిం బోల్చుకో లేకయే
మాలో మే మొక నవ్య నవ్వెదము సుమ్మా! నీ సమక్షంబునన్ -

నీలో నీవొక పల్కు వల్కెదవు! దానిం దెల్పుకో లేకయే
మాలో మే మొక పల్కు వల్కెదము సుమ్మా! నీ పరోక్షంబునన్ -

బింకము లేనివాడవు, వ్యపేత కళంకుడ, వున్నతాశయా
లంకృత బుద్ధి, పీవు శ్రితులన్, సుతులన్ సమ దృష్టి జూచి వీ
యంకము జేర్చివాడ, వుదయ స్మరణీయుడ వెల్లవారికిన్ -
వేంకట రెడ్డి! నీ బదులు నీ యశ మిచ్చట రాజ్య మేలెడున్.

నీ సోదర్యుడు రామి రెడ్డి కృతికిన్ నిన్ భర్తగా గైకొనం
జేసెన్, జంకె కుల ప్రశస్తికి ప్రశస్తిం దెచ్చి భాసిల్లె - నీ
చే సేతన్ మెఱు గెక్కు సభ్యతలు గాంచెం బెక్కు- లోయన్న! యీ
శ్రీ సమ్య క్పదవీ ధురీణునకు నాశీర్వాదముల్ పంపవే!

ఇక నీరాజన మిత్తు నీకు సుమనో హృద్యైక సౌరభ్య వీ
చికలన్ రోచుల మేళవించి - ఇది వాసిం గాంచుచుం దావకా
త్మకు శాంతిం గదియించు గాత! హిత రత్నమ్ముల్ ప్రమోదింప నీ
దు కుటుంబమ్మునకున్ శుభాభ్యుదయ రీతుల్ గూర్చెదుం గావుతన్!

వేములకోట,
మార్కాపురం తాలూకా.

రాయప్రోలు సుబ్బరామయ్య.



కృతి భర్త

కీ॥ శే॥ శ్రీ జంకె వెంకటరెడ్డిగారు

## ఆంధ్రమాత

నన్నపార్య వచో మృణాల మాంసల కవి
హంస లార్చెను తెక్కు లాంధ్ర సరసిః
రాయల ఖడ్గ ధారల లొంగిన పొలాలు
తెలి వెన్నెలల్ ప్రసాదించు కొనియెః
తిమ్మరుసూ క్లోక ధీ లతా పరివృత
స్థలములు వికచ పుష్పముల నిండెః
త్యాగరాయన్న గీత ప్రవాహము ముంచు
కొనిన చోట్ల మృతంపు గొలకు లయ్యెః
మహిత మహిత కళా నిత్య మాన్యులైన
ఆ కుమారులు నిజ కౌశ లానుకార
చారులకు మార్గముల్ చూపినారు - వారి
గన్న కడుపున కిదె నమస్కార శతము।

అమ్మా। నీ చనుబాలు గ్రోలి. అతిలోకానంద పీయూష పా
త్రమ్ముల్గా. బ్రాత రపా వృతారుణ విభా తారుణ్య లావణ్యముల్
గ్రమ్మంగా, బయికెత్తి యాడు సుత లోకమ్మందు నాడింపకే
చిమ్మం జీకటి కోన గట్టితివె యిస్సీ। నాకు నా డోలికల్గా

## మనోవికృతి

నింగిని వ్రాయుచుండె రజనీ ముఖ వేళ కళార్థి యెవ్వడో
బంగరు కుంచెతో శబల వర్ణపు జిత్ర పటమ్ము; అప్పుడే
నుం గవి నన్ను భావము మనోగతి మై మొగమావరించి తి
రెంః గలమందుకొంటిః కను రెప్పల నించుక మోడ్చినాడను౯.

# దేవా!

ఇందు గర్భ సుధా భాండమందు ముంచి
యిమ్ము నా కల-మేర్పడు కృతులు నీవి;
ఆకసంపు శాణోపల మందు పదను
పెట్టి యిమ్మొక కత్తి- నీ పృథివి నెల్ల
నీకె కైవస మొనరింతు; నేటిదాక
నెత్తవేటికి జవనిక? — నింపులొలుకు
గీతితో సూత్రధారినై కృతక రంగ
మంచలో మూర్ఛ పడెద నీ చెంత; దేవ!

సరస గానాలాప సాంగత్యమున జొక్కి
వెదురు జొంపమ్ముల నొదిగినావొ!
కవనంబు సొంపు జక్కని కూతలో నింపు
పిక కంఠ నాళాల వెలసినావొ!
శ్రమ లేక సుమ సుగంధముల దొంగిలి పోవు
చిన్ని గాడ్పుల తోడ జేరినావొ!
లగ్గింత చూపుచు నెగ్గింత రెండింత
లుగ జూపు మెఱపులో మిగిలినావొ!
కాక నా కన్ను గవ కేల కానరావు? —
నీవు ప్రకృతి రహించు టెంతే దలంతు.
ప్రకృతికి నతీతుడవొ యంచు బాఱ జూతు.
నేమి దోచక తలపు మాయింతు; దేవ!

గిలికినది యేవియో రెండు గీటు లట్టె
అప్రయత్నమ్ముగా కల - మంతలోన
నన వధానత ప్రాప్తించె - నకట! నికట
శాఖపై నున్న కోయిల చాన గూసె.

హృదిని నేదొ వికారమ్ము గదియ శీర్ష
మెత్తి చూచితి కొమ్మపై నెగురు పిట్ట -
కాగితము పైవి బుడగ రొక్కముగ బెట్టి
ఖిలిచెను సువర్ణముఖి లేఖినీ మతల్లి.

"కల కుహూకార సుభగ రాగమ్ము విసరి
వైచితివి; సాంధ్య రోచి రుల్బణ విలోచ
నా! రుషాప్తి నీకేల? నా నేర మేమి?
కలము సాగగ నీయవా? గడుసుదాన!"

అని బ్రతిమాలుకొన్నయటు లంటినొ! ఆ యవకాశ లబ్ధి లే
ఖిని పరువెత్తె - నంత పరికించితి! నీల మషీరసమ్ము నిం
చినయది పత్రసీమ - విరజిమ్మె - గలస్వన గీతికా విమో
హన మధు శీకరమ్ముల బికాంగన మున్పటికన్న మిన్నగా

ఇంక వ్యవహార మేమియు నింపు లేక
ఇట్టె చూచితి - పొదనుండి యింతదనుక
విస్మృతి హేతు సుమామోద వృష్టి బఱపి
పటు చమత్కృతి చేసిన ప్రణయశీల

పకపకని నవ్వు మర్మర ధ్వనుల రేప
వచ్చి సోలెను నాపైని - బాహిరముగ
తెలియ జెప్పెడి దేమి? ఆ తెంపు లేని
నవ్వులో నాలుగశ్రు కణాలు గంటి!

## కేశవస్వామి

ఓ మసృణాంబువాహ నికరోపమితాంగ వికాస! యాత్రిక గ్రామణి నేత్ర పర్వకృదఖండిత మూర్తి విలాస! కేశవ స్వామి! జోహారు! యియ్యది ప్రపన్న నివేదన; స్వీకరింతువో! ఆ మహితాభయప్రద కరాంచల సంజ్ఞ నిరాకరింతువో!

౧ ఉండెలే! యిచట మార్కండేయ మౌని త
పస్సమాధిని గొన్న భవ్య దినము.
౨ కలదులే! యిచట రాయల కేలుదోయి వి
శ్రాంతి గైకొన్న ప్రశస్త దినము.
౩ అలరెలే! యిచట వేమన్న తత్త్వము లాట
వెలదుల కెక్కిన విమల దినము.
౪ మెఱసెలే! యిచట సోదరుల శిల్ప ప్రౌఢి
గంటాలు దీకొన్న కమ్ర దినము.

---

౧ శ్రీ మారికాపుర కేశవస్వామివారి శిలా విగ్రహము తపస్సిద్ధుడైన మార్కండేయునిచే ప్రతిష్ఠింప బడినదని స్థల పురాణము.

౨ శ్రీ కృష్ణదేవరాయలు కటకమును జయించి వచ్చుచు నిచ్చట వి

ఆ శుభ సుఖ క్షణమ్ముల నవ్యయ ప్ర
మోదమున దిక్కుల హసించి పొలుపు గన్న
మారికాపురి గోపుర మస్త మెత్తి
చాటులే నేడు! నీ మహోత్సవ విభూతి.

నీ వాక సంబలాన గమనింపవు నాదు దురంత వేదనా
భావము నంచు నూహ సలుపం గద! యింటికడన్ - విరాన నే
నీ విధి వచ్చి, యేమొ వచియింపగ బోయితిగాని స్వామి! నీ
కోవెలలోని మేళముల గోలకు మూగవడెన్ గళశ్రుతుల్.

వెలుగు నొసగెడి వెలుగుల వెలుగువంచు
నేను ననుకొంటి _ పూజారి నీకె వెలుగు
దెచ్చుచుండుట గంటి - తాత్త్రీయ గుణ ప
థాను వర్తిని నన్నెట్టు లాదరింతు?

---

డిది చేసి, యేతత్ స్థలమాహాత్మ్యమున కలరి, దేవాలయ నిర్మాణమునకు బూనుకొనెనని అనుశ్రుతముగా వచ్చు కథ గలదు.

౩ వేమనయోగి యీ దేవాలయమున విశ్రమించి కొన్ని దినంబులు తాత్త్విక విచారము చేయుచుండెనని శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారి "వేమన" చరిత్రలో గలదు.

౪ కేశవస్వామివారి యాలయమండపము ముందుభాగమున "అన్నదమ్ముల స్తంభము" లనబడు రెండు రాతి కంబములు గలవు. వారు తమ శిల్ప కళా నైపుణ్యమును జాటుటకు మధ్య తెర గట్టుకొని వానివి జెక్కిరట! అవి యెచ్చటను భేదము లేక యొక్కటే యచ్చున గ్రుద్దిన ట్లున్నవి.

యాతాయాత జనమ్ము సందడుల దేవా! నీదు గర్భాలయం
జేతమ్మెత్తె సముద్ర ఘోషకు - మతేదీ తావు నా ఘోషకున్?
జేతః ప్రీతిగ నారికేళ ఫలముం జేకొంచు నే రాగ, నా
చేతన్ లేదది - కొట్టివేసి రెవరో! చేమోడ్పు లా భక్తికిన్.

పరమ పావన తావక పద సరోజ
యుగళమును జేరెనే నదియును మదీయ
జన్మమును ధన్యములు! కాక చక్క నే త్తు
ధార్త్తు నుదరమ్ములో బడనైన నంతె!

నిత్య నైవేద్యమే లేక నీవు పస్తు
వడిన నాడు జగమ్మెల్ల వణకి పోవు!
రేగు నట్టాకటం దూలు కృపణ జీవి
యూర్పు. లాపడియున్న నిన్నూప దేమి?

దానికేమి తండ్రి! యీ నవతా నవ
మోహనోత్సవములు మూల దైవ
తోత్తమునకు గాక యుత్సవ విగ్ర
ములకు జెల్లు చెల్లొ! తెలుపుమయ్య!

అంధ లోకము! మట్టుమర్యాద లేమి
యెఱుగు? నడి మంత్రపుం బయి మెఱుగు నభిన
తించి భూచక్రపుం గొడు గెత్తి పట్టు -
"మొదలు" విస్మరించుచె దాని మూల విద్య.

కాలము మాఱిపోయె - కలకాలము నికిటు లుండగాదు - ర
మ్యాలయ సీమ పీడి కరుణాలయ! బాహిరవీధి - కియ్యెడన్
వేలకు వేలుగా ప్రజలు విశ్వజనీనములైన నీదు పా
దాలకు మ్రొక్క వచ్చిరట! దర్శన మిచ్చి యనుగ్రహింపవే

ఆలయ ప్రాంగణమందు కాలిడు నంత
    యోగ్యతలేని దౌర్భాగ్యు లొకట.
దీన దృక్కులె నీకు దెచ్చిన కాన్కలై
    చే త్రోపులందు కుచేలు రొకట,
"బాబు! బాబూ! కాని బడవేయు" డని బిచ్చ
    పుం గిన్నెలను జాచు పంగు లొకట,
"కన్ను లేని కబోది గదర! నారాయణా!"
    యంచు గోడాడెడు నంధు లొకట,
జనము త్రొక్కిళ్లకున్ దాళకొనగ లేక
వెను ధిరిగి పోవ నున్నారు: వెడలి వచ్చి
వర వరాభయ సదమల కరము లెత్తి
పిలిచి, పిలిపించుకొని, కొలిపించు కొనవె!

# తెనాలి కవి

లింగడవో! కృష్ణుడవా! యె
ఱుంగక తంటాలు పడెడి ప్రౌఢలతో నే
వంగడి బేరము సలుపక
పొంగెడి నీ హాస్యరస విభూతిం దలతుఁ.

అల్లసాని కులీను నల్లిక జిగిబిగి
"అమవస" చీకటి నణఁగె నంట!
ముక్కు తిమ్మన గారి ముద్దు పల్కుల సౌరు
బుడి బుడి "యేడ్పుతో" పొగిలె నంట!
ధూర్జటి మాధురీ ధుర్య మాహాత్మ్యంబు
"హా! తెలిసె" న్నాగ నడలె నంట!
భట్టు మూర్త్యశ్లేష పదబంధ కృతి భూష
"భూ" యన నిశ్శ్రీక మాయె నంట!
నీదు చాటూక్తి గుంభనాన్విత వినోద
గతులు శ్రుతి మీఱు నాళ్ల నో కవి వతంస!
ఇవి యథా స్థాయి గనిన నయ్యవి యపూర్వ
సముపలాలిత చిర విలసనము లంట!

మా తెలుగునాడు కమ్మ కమ్మనిది - యిచ్చ
కాల నుడికారములకు బేర్గనిన దన్న!
ఎన్ని పొట్టలు విచ్చి పోయినవా! నోఱు
విచ్చి నవ్వక, నీవు నవ్వించు నాడు.

నీ పిలక జుట్టు గాలిలో నిలిచి. అతి హ
సిత ముఖరుడైన జలధర శేఖరునకు
బాష్పములు రాలిపించెనో! భళిర! నీదు
హాస్య రస పూర మీనాడు నలుగు పాలు.

"వికట కవి" వయి యెట్లు త్రిప్పినను జెల్లి
యున్న నిను వీధిలో గాంచి యెదుగు చుండు
దమ్ము దామె నమ్మని పెద్ద తలలు గూడ -
బుదుత లుందురు డాగురు మూతలాడ -

ఏదొ సింహ నాదమ్మున కేపు దక్కి
దిగ్గజమ్ములు మూలల క్రుగ్గుచుం ది
గాలు పడ. విప్పు నీ "తిలకాష్ఠ మహిష
బంధనమ్ము" వ కొక నమోవాక మయ్య!

ఏమి సరసాలురా! యిత్తువే రసాల
ఫలము లటు పచ్చివాతలు బ్రాహ్మణులకు -
ఏమి యెత్తి పొడుపులురా! యెంత వాని
పొత్తమును గాని "చేపల బుట్ట" యనెదు -

నీ తాపేతు హిమాచలమ్ము నెదురున్నే? అగ్రశాఖా పిక
మ్మా! కాఖాలు పఠించు మేము నిను నమ్మంగా లేము కాకోల! వా
చా కౌశల్య సమృద్ధి వ్యక్తిగత దోష ప్రక్రియా ఖండనై
కాకూతమ్మునవే వెలార్చితివి కాదా! స్నిగ్ధ హాస్యప్రియా!

ఎవరో "నీవొక హాస్యగాడ" వనినారే? వీధిలో నాటకా
లవునా సార్థక తావకీన శిత చర్యల్; కావురా తండ్రి! మా
భవితవ్యమ్మును దిద్ది తీర్చిన మహా భాగుండ; వానాటి వి
ప్లవ నృత్యమ్ములు కొన్ని మాటు మణగెన్ త్వద్భూమికా క్రీడలన్

కొందరు తోడి పెండ్లికొడుకుల్ భవదీయ వినోద సాహితీ
నందితులై దృఢానుకరణ ప్రతిభన్ నినువంటి వారలై
యుందురొ! నాడు: మే మొకటి కొక్కటి చేర్చి, యథాసొనర్చి క్రం
చుం దనపుం గతల్ సుకవి సోముడ! పుక్కిట బట్టినాము రా!

తత్త్వ నిధివి: చతుష్కావ్య ధారలందు
ఘనుడ! - వెటు నీటికన్న జుల్కనగ జూతు
నీ చరిత్రము? పోకిరి నిగమ శర్మ
చరితలో వది గంభీర సరణి దాల్చె.

చతుర వచన విలాస లాస్య ప్రవీణ
యైన ప్రౌఢాంగనం బోలునట్టి "పాండు
రంగ" కృతి యన్య కావ్య ముగ్ధాంగనా వ్ర
జమ్ము నదరించి బెదరించు చాయ దోచు!

వేములవాడ శ్రీ భీమ కవీంద్రుండు
గంగ్రాజు పైని శంఖమ్మునూదె.

శ్రీ నాథ కవిరాజు వెలగి డిండిము పైని
గేకిసల్ గొట్టి మ్రోగించె భేరి.
నీవు గర్వోన్మత్త నృప పండితుల మర్మ
ములను భేదింపగా మొనసినావు.
తిరుపతి వేంకటేశ్వరులు నానా రాజ
సభలలో గుస్తీలు సలిపినారు.
అబ్బ! కవి యోధులార! మీ యంతవారు
మీరె: సాహితీ విజయ విహార లీల
కీ తెలుగురాణి కడుపుననే జనింప
రారె! యెన్నొ జన్మము లెత్తు వ్రాత యున్న.

## శశిరేఖ

ఆ లలాటము శశిరేఖ! లోల చూర్ణ
కుంతలాంబుద శకలాంత గోచరమ్ము -
ఆమెయుఁ శశిరేఖ! నీలాంబరాంక
తలి బిసాళించు కమ్మ వెన్నెలల బుగ్గ -

ఆ నడ బావి కింత యెడమందు నిలంబడి యుండు నే కతం
బో! నును గేల వల్లికను బూని దెసల్గను చుండు నే కతం
బో! నడురేయి నొంటిగ గృహోపవనిం జరియించు నే కతం
బో! నన వంటి లేతమనముఁ విదళించిన దే యుదంతమో!

చీని చీనాంబరముల దాల్చెడు కుమారి
మాసి పోయిన పయ్యంట వేసి, బోసి
పోయి నట్లుండె నీ నాడు - పోవ నేమి?
ఎడద ప్రీలి విలాపింప దొడగె నిట్లు -

"మా పసినాటి ముచ్చట లమంద ముదం బొడ గూడ్చ బేర్మిమై
మా పయి బోసి నట్టి కుసుమమ్ముల దీవన లేమి యయ్యె? తం
డ్రీ! పగబట్టు త్రాచు వలె రేగి విసమ్మును గ్రక్కు-కొంచు. నీ
పాపల వెంబడించి; ఇక ప్రాణములం గ్రసియింప కుందువే?

మున్ను సభాంతరాళమున ముద్దుల చెల్లెలి తోడ "నిత్తు నా
కన్నియ నీ కుమారునకు, కల్ల వచింపను, బాస సేతు" నం
చన్నది పొల్లు సేయ దగవా? భగినీమణి కంటి నీటితో
నిన్ను శపించుకొన్నయది: నీ కులనాశన మాపతింతువా?

మా మేనత్త సుభద్ర కూటికయి నీ మాన్యంబులం గోరెనా
యేమీ? "పుట్టిన యింటి కిట్లు గతి లే కేతెంచుటే కాక, యే
మో మాటాడెదు పిల్ల పెత్తన" మటం చుద్రిక్త చిత్తమ్ముతో
ఆ మర్యాదవతిఁ దురుక్తు లన నేలా? నీవు; శ్రీమంతుడా!

అకట! మా పిన తండ్రిగా రవ్వగారు
"చిట్టి తల్లి జీవిత వల్లి జేతులార
నొక్క యవలక్షణపు మ్రోడు కెక్క జేయ
దగ" దటన్నను నీ పట్టు తఱుగ దేమి?

నాయన పీవు - పూజ్య చరణమ్ములు నా పసుపుం దుకూలపుం
జాయల దానమాడునను సంబరముం గనినావు కాని, ప్రే
మాయిత మూర్తి నర్జున కుమారకు దాసిన నీ కుమారి బా
ష్పాయత ధారలం జలక మాడగ జాలిని బూని నావొకో!

విత్తము తోడ జేసెదవు వియ్యము - నా మెడలోని తాళి లో
కోత్తర మూల్యమై వెలయునో! మనసీయని యాడుదానితో
హత్తిన కాపురమ్ము ప్రళయాంతక మంచు సుయోధనాత్మజుం
డుత్త యమాయికుం, డెఱుగకున్నను పెద్దలు మీ రెఱుంగరో!

గాదిలి బిడ్డకుం స్వయముగా ప్రియునిం వరియించు హక్కు నీ
రాదను తండ్రిగారి కెదురా యొక? - డింతకు మాకు నాటలం
దే దొరసెం గరగ్రహణ దివ్య మహోత్సవ - మీవు ప్రేమలో
పేదఱికమ్ము జూప దలపెట్టిన మార్మను విచ్చగింతునే?

కౌమరుం బ్రాయపువాం, డుదాత్త గుణ రక్తుం, డచ్చ కౌలీన వి
క్రమ విఖ్యాతుడు నైన నెచ్చెలికి దూరమ్మైన నా మేన బ్రా
ణములే యున్న పితా! వివాహ విధులం గావింపుమీ! లేకయు
న్న మదీయాంత్య కలాప నిర్వహణ సన్నాహంబు సాగింపుమీ!

నేను మరణించినా నన్న నీ వొకింత
కంట దడి పెట్ట వేమొ! - అక్కటా! క్షమింపు
మయ్య! నిన్నె శంకించు నీ యల్పురాలి;
నాకు దండ్రి వీ వెన్ని జన్మముల కైన."

అనుచు బాలామతల్లి శోకాశ్రు గద్గ
దమ్మయిన కంఠమున మాట తగులు వడగ
నిలిచె నొక్కింత సేపు; పవు దలలు రేగి
దీర్ఘికా గర్భమున నినదించు చుండె.

ఆపె యొకసారి నడబావి వైపు మఱియు
నొక్కసారి కరమ్ము నందున్న సోగ
తీవ వైపును జూచె - తత్తీవ్ర వీక్ష
ణమున తెగుదారి తనమేదొ యిమిడి యుండె.

మానసమ్మున నభిమన్యు ధ్యానలీను
గా నొనర్చి, అయ్యయొ! తన కంఠమునకు
నా లతా పాశమును బిగియంగ జుట్టె
కన్నె - హత మనోరథ లెంత గడుసు వారు!

"ఆగుమా!" యన్న గళరవం బప్పు డొకటి
తార మధ్యమ మంద్ర నాదత్రయమ్ము
తో గలసి వినబడియె - నా త్రోవ నడుగొ!
వచ్చె సురమౌని మహతితో బాల కడకు.

వచ్చి, కన్నియ చెవిలోన బరమ మంత్ర
మేమి యూది పోయినవాడొ! ఆమె వికసి
తాస్యయై నిజ గృహమున కరిగె జేత
తీవియను విలాసమ్ముగా ద్రిప్పికొనుచు.

# విశ్వరంగస్థలి

విశ్వ నాటక దృశ్యావ ప్రేక్షకులకు
నటులకుఁ మధ్య యవనికా పటము లేల?
నటులగుచు నెల్లవారలు, నాట మొదలు
సురట వఱకును లాగుచు, సొగసి పోవు
భావ లలితైక "లాస్య విభ్రమములన్ని"
జూపవలె - చోపుదారులు భూప వేష
ధారు లేటికి గారాదు? తన్మయత్వ
మున బురుష భూమికలను భామినులు దాల్ప
వలను పడ దేమి? పాత్రతా పాత్రతలను
ఇట విచక్షింతుమేని మాయించు చుంటి
మే కదా! సర్వ సమతోక్తి; నెల్ల పైణి
కోత్తములు నెల్ల మార్దంగికోత్తములను
"మాకు వేసాలె" యన్నచో మనము వారి
నెట్టు లొప్పింప వలయునో! - ఏది యెట్లొ!
రంగు చెడకుండ మంగళాభంగ గీతి
వెలితిలేని శ్రుతిం బెనవేసి, పెద్ద
చిన్న దొరసాను లెగతాళి చేయ బోని
యట్లు నటియింత; మింక జయోస్తు మనకు!

# శుభాకాంక్ష

నిదురమంపున నావులించెడు నిశీథ
ములు సురిగి పోయె - కెంపుల ప్రొద్దు పొడుపు
కళుకులోన ప్రదోష రేఖా వియుక్త
దివ్య దివసము స్వచ్ఛంద తేజ మొలికె.

మెలపుతో సుప్రభాత మంజులములైన
పుష్పములు గొని మాతృ సంపూజ నేచ్చ
నేగి నా రెల్లవారలు; నింతదనుక
నయ్యొ! మేల్కొనకుంటి; వే మందు నిన్ను?

నీ పయి నున్న కార్య సరణిం దలపోయకయున్న నిన్ను బ్రే
రేపగ రాదొకండును; శరీర మధీనమునందు లేదొ; నీ
యూపిరి నీవు పీల్చుకొన కుండిన నెవ్వడు పీల్చునయ్య! స్వే
చ్ఛా పథ కామివై వెసవెసన్ విహరింపు విమాన వీధిలో.

ఎపుడు కష్టాలలోనే జీర్ణమై పోవు
నీ శరీరమ్మును నిమురు కొమ్మ!
గుడ్డల రీతిగా గూలంగ బడి పోవు
కాళుల నిటు నటుల్ కదుపుకొమ్మ!
కాంతి హీనమ్ములౌ కనుదమ్ములం బుల
పొడిచి క్రొంబొలపము బూసి కొమ్మ!

ఉత్సుకం గాని భావోద్రేక సమితివి
గాలి పిల్చగ బైని గదల నిమ్మ!
నీ ప్రభాత భేరీ నవ నిస్వనమ్ము
లారె గడల - శిధిల పురా భారతీయ
విభవముల విగ్రహమ్మ! నీవే వరాల
శిల్పివై దిద్దుకొనుముర! జీవ కళలు.

చేతులు చేతులు గలిపితి
మా తీరున గయ్యమునకు నా రోజులలో:
చేతులు చేతులు గలుపుద
మీ తీరున నెయ్యమునకు నీ రోజులలో:

స్వారాజ్య రసాల ఫలో
దార మధుర రుచులు సూడ దత్తర మేలా?
నేరిమి బందును దలుగక
భారత సుత! ఆస్వదించు భారము నీదే!

## శాంతి భిక్ష

బాపుజీ! కాళరాత్రి!! దుర్భర విషాద
గీతికలు వల్కు. త్యాగయ్య కృతులు చిందు
లాడుకొను వీణియల తంత్రులందుగూడ.
రామ నామ పిపాసి! వేర్పడని శ్రుతివి.

ఏ యొకటి దక్క మిగిలిన వెన్నొ యన్ని
దైవికాంశలు సుషమా నిధానములయి
రూపు దాల్చెనొ నీవుగా! రుచిర మంద
హాస పంక్తులె విశ్వమ్ము నాదు కొనియె.

భగవ దాదేశమున వెళ్ల వలసె గాక
యుంటివా! గుండెలో నప్పు డొదిగియున్న
గుండు గోలీగ నా హంతకున కొసంగి
"అదు కొందముః" యను వాడవయ్య! నీవు.

ఓ మహర్షి! మనోజ్ఞ భావోదయ ప్ర
సన్న మృదు వాగ్మి! తరళ నక్షత్ర వీధి
నదిగొ! జ్యోతిర్లతా నివహమ్ము; మంగ
ళోత్సవమొ! తండ్రి! మాకు నా యూహ లేవి?

విశ్వ బాష్ప తరంగిణీ విస్తృతముగ
నింక నొక సంద్ర మేర్పడు నేమొ కాని,
పెను తుపానవసరము; నీ విమల భూతి
కణము మా నాసికల కందుగా! మహాత్మ!

★ ★ ★

చంద్రికా పులకిత నిశా సమయ సుప్త
మైన ప్రకృతిని బోలు శాంతాము లాంత

రంగ మే జీవకోటి నీరవ మనో వి
కాసి సీమల భాషించు? గాంధి దేవ!

ఆకు పసందు, తీవియల అల్లికలం దెగ ద్రెంపి, మాకు నా
జూకు సువాసనల్ మలయు సుందర సందన వాటికా సుమా
నీకము దోయిటం బొరల నింపితి; వియ్యవి వాడు పట్టుచో
మా కరణీయ మేమొ మధుమాసపు కోకిల భాతి బల్కవే!

అమర వేణీ తటాంతికమందు గూరు
చుండి, మే మొసగిన నివాపోద ధార
కై కరము సాచి నాడవా? అయిన నేల
బాగు? మా యంజలుల కిమ్ము శాంతి భిక్ష!

## వైరాగ్య స్ఫూర్తి

వివిధ విహగ గరుత్తతి విసరు గాడ్పు
లకు బ్రదోష ప్రదీప కోరకము మలిగె -
మాటు వడియె దమంపు సమాధియందు
గళిత చేతనమైన జగచ్ఛవమ్ము -

దారి తొలంగి, చీలు పెడదారుల బట్టి నలంగి, యెట్లొ వే
సారుసు జేరుకో నరుగుచుంటి - అలంత నితాంతమయ్యె నా

యూరు సమీపమౌ కొలది - ఒంటరిగా బయనించుటన్న ని
స్సారపు గావ్యముం జదువ సాగుటగా నధిక శ్రమాంతమౌ.

పొన పొన గాననయ్యె దరు పుంజము నందుల నుండి మిన్కు మి
న్కన వెలుగుల్ వెలార్చు నొక కొన్ని గృహాంగణ దత్త దీపికల్;
కనుకని నుత్తరంపు దెసగా బొలిమేరను జేరుకొంటి: జ
ర్రున నెదియో చలింపగ మరుత్స్నుత దండకముం బఠించితిన్;

ఉన్నయటులుండి భగ్గున నొక్కసారి
దరికొనియె గొంత యెడమున దహన కీల
విహ్వలమ్మగు చిత్తమ్ము బిగ్గ బట్టి
చూతు గద! అద్ది మానవ ప్రేత మవుర!

కంపిత వపుర్మలీమస ఘర్మ పంక
మింక. శాంతి శరజ్జ్యోత్స్న యంకురించె
హృదయ వీధి - నూహలు గొన్ని రేగి చైత్ర
యాత్ర సాగింప జొచ్చె నే నచట నిలువ -

అది పవిత్ర శ్మశానంపు యజ్ఞ వాటి!
ఆ చితాగ్నిని వేల్వగానైన పుణ్య
మనుజ శవసామిధేనికి మామకీన
ధన్యవాదము! లీ జన్మ ధన్యతమము!

శర్వ భైరవ తాండవ చటుల కటక

శింజితములకు శోషిలు జీవుల కిట
హాయి విడబోలు! తజ్జటా స్యంది భుగ్న
నాక శైవలినీ శీత శీకరములు.

రెండు లోకాల నడుమ నిర్మింప బడిన
నీరవ జగత్తు - దీనిని జేరబోని
ప్రాణి లే- దేల భీతిల పంచతాప్తి?
కడియె పారలౌకిక జన్మ మగుచు నుండ.

ఎంత విశ్రాంతి!! ఎంత ప్రశాంతి!! యిచట
బవ్వళించిన వారికి నివ్వటిల్లు;
వీరి కొఱ కేడ్చువారి కన్నీరు రేపు
వారి కొఱ కేడ్చువారి కన్నీర కాదె!

తర తమ భేద భావములు తచ్చన లాడగ, మోద ఖేదముల్
పెరయగ, బాంచ భౌతిక మలీమస కాయము మోసి, రోసి, యీ
చిర సుఖ శయ్య నొత్తిగిలు జీవులు "నీ వెవ" రన్న ప్రశ్న వే
యరు గద! సానుభూతి తొలకాడ; నిదేమి విరాగ యోగమో!

ఒకరు బ్రదుకంగ జాలిన నోర్వలేని
వారు బ్రతికిరె; భూగర్భ వాసు లగుచు
విపుల సహనమ్ము జూపింతు రిపుడు. స్వీయ
పార్శ్వతలముల నొక్కింత పాలొసంగి;

ప్రబలాశాపరులై, యుపాధి రహిత ప్రారంభులై, ద్వేష వి
క్లబ సత్వాంగకులైన ఘాతుకులు. శుష్క-క్రవ్య ఖండాళి విం
దుబలాటంపడు నండ జాతిథుల నోరూరంగ నందించుచుఁ,
శిబి రాజన్యులుగా తయారయి; రహో! చిత్రమ్ము లీ మారుపుల్.

అట్టు లనుకొంచు బయనమ్ము గట్టనుండ
నొక కపాలము నను జూచి పక పక నగె -
పాప పుణ్య వివక్ష కీ ప్రాంత మందు
వీలు పడదేమొ! యంచు భావించుకొంటి!

వ్యాయామ మేదుర బాహు బలుండైన
"కలియుగ భీముండు" కానరాడు.
చెట్లకు జీవమ్ము సృజియించు ప్రకృతి శా
స్త్రాఖ్యాత "జగదీశు" డంతు లేడు.
కవి విత్య సమ వయస్కృత గ్రాలు ననుచుండు
అల "రవీంద్రుండు" మాయమయి రాడు.
ఆత్మ విశ్వాస సత్యాగ్రహవ్రత వశం
వదుడు "మహాత్ముండు" వచ్చి పోడు.
"ఎంతవారల దైనను ఏమి శాశ్వ
త" మ్మటంచు పదంపడి తలచినాడ!
గ్రామముం జేరినాడ! నా గమ్య గృహము
దాటి పోవునంతటి పరధ్యాన బుద్ధి.

యోగ్యము కాకపోయినను ఒక్క క్షణమ్మిటు లీ శ్మశాన వై
రాగ్యము బూనితిన్; పవిత్ర రత్నమ! నీవును నీ పురాణ వై
రాగ్యము బూను మొక్క మధురక్షణ: మంతియ చాలు సంచితా
భాగ్య దశానుభూత బలవద్విషయ వ్యథ లాగి పోవగన్.

# స్వప్నోద్యానము

అలయ కమాన చీకటు లొయారపు బిందులు త్రొక్కుచుండె - క
న్నుల కొక కూర్కు లేక కడు నొవ్వన బొర్లుచునుంటి - గుబ్బ కొ
య్యలు నడు వెత్తి పైని నడయాడుచు నుండగ నిద్ర వట్టె నె
ట్టులొ! - అనుకోవి తీరుగ నిటుల్ కలగాంచుచు నుంటి వెంటనే.

నిగనిగలు వోవు వెన్నెల - నెమలి కేక
లేపు మీఱెడు పూపొద - లింపులొలుకు
నేటి కాలువ గలగల - లిన్ని యున్న
యుపవనమ్మున నొకరీతి నుంటి నేను!

మిణుకు మిణుకని చల్లారు మిణుగురుం బు
రుంగు నవ పల్లవంబున జెంగలించె -
మసృణ తృణ శయ్యపై మేను మఱచి నిదుర
జెందుచున్నది పెంపుడు జింక యొకటి -

కాలువ కొలంకులఁ జెంగనాలు దీయు
పిల్ల పామొందు మెలికలు వెట్టి పోయి
సుప్త హరిణార్భకమ్ము మచ్చునకు నిదుర
లేపె; నదియేమి సరస సల్లాప గతియొ!

ఆ చిఱుత కాల్వ గట్టులయందు మొలచు
తుంగ నడినీట దన పాప దొంగి చూచు
కొనుచు మురిసి పోవంగ, నా క్రోవలందు
నవకపుం బూవు దీవెలు నవ్వుకొనియె.

అనుభవోత్కంఠులకు నిస్పృహతను దార్చు
న సులభ గ్రాహ్య జటిల ఫలాళి నారి
కేళ వృక్షాగ్రములయందు వ్రేలుచుండె
ముదురు పాకమ్ములో బడిపోయి. అదిగొ!

వలపు చలువలు నిండారు వకుళ వృక్ష
మూల మృదు శాద్వలమున, నే మూలకో యు
పొంగ దృక్కులు ప్రాకిపోవంగ, గూరు
చుంటి; నా నీడ తోడుగా నుండె నాకు.

సురభిళానిల శైత్య తరళితాంగ
కమ్ము లుష్ణ నిశ్వాస సాంద్రమ్ము లయ్యె -
ఏమి దోచక యున్న నాకేమొ పరిచి
తారవమ్మొందు వినబడి నట్టు లయ్యె -

హరిణ పోతము నా చెంత కరుగు దెంచి
చెవులు నిక్కించి నిల్చె - పిచిన దదొక్క
వింత వలినాలి తెమ్మెర - కాంత యొర్తు
కట్టెదుట నిల్చె నందెలు ఘల్లు రవగ -

"ఎవరు? నా బహిః ప్రాణమా!, ఎన్ని నాళ్ల?"
కనుచు నసమగ్రముగ బల్క చట్టె లేచి
అతివ సమ్ముఖమందు నిల్చితి, మృగాక్షి
వెన్కకుం దగ్గె, మృగమును బెదరి పోయె -

చేతులం జాచినా నక్షిపాత మోహ
హాస్యయగు నామె మృదులంపు హస్త యుగళ
దమి స్పృశింపగ; కాని యా తాకు కండ
నది సమీర కుమారమే యయ్యె నకట!

వెన్నెలలు గాయుచున్నవి - వెలది నవ్వు
చున్నదో గుర్తు పట్ట లేకుంటి! నంత
పొగడ మాటున కేగి యా పగిది బల్కె
గోట మీటిన వీణయై కువలయాక్షి.

"ప్రియుడవని నమ్మి మామక హృదయ ఫలక
మర్పణము చేసికొంటి నీ; కందు నేదొ
అప్రియా లేఖ్యముం గీయ నవధరించి
నావు; చాలును చాలు నీ నాలితనము!"

ఉలిక్కి పడి యంటి నే నిట్టు "లువిద! యేమి
ఇంతగా మాఱి పోయితి? వీ ప్రవాస
ఖేద వివశుండు తప్పేమి గీలు కొల్పె?
కరము అంటగ బోవుచే కలువ మొక్కా!"

"అంటరాదని పల్కితినా? అదేమొ!
నీ యుపక్రమణమ్మున నిరయ వాహి
నీ తరంగ వితానము మ్రోత పెట్టు
చున్న దనిపించె నిపుడు; విచ్ఛిన్న హృదయ!"

అనిన దామె - యొకింత శంకాకులుండ
నగుచు నే నంటి "నకట! నా యాసలన్ని
వాయు ధుత వారిదమ్ములై పోయె లెమ్ము!
నిన్ను, నీ వాలకము, గనుగొన్న యపుడ.

ఏ నొక వాగు వంతెన పయిన్ మునిమాపున పిల్ల గాలిలో
వేణువు నూదికొంచు వినిపించుచు నుంటి శకుంత సాక్షిగా
గాన కళా రహస్యము లొకానొక నా; డపు డీవు చూచి నా
తో ననినావు నెమ్మదిగ "తోడు" గ నుందు నటంచు సుందరీ!

ఆ తరంగిణి తటముల నల్ల నాడు
శిరసు లూచిన సుకుమార తరు చయమ్మె
మనకు సాక్షి; ప్రేమించితి నిను లతాంగి!
నాకు "అర్ధాంగి" వని యెంతు నాట నుండి."

అంత శఫరీ విలోచన నంత నా యు
పాంత తలి జేరి యనియె "ప్రేమార్థము నతి
కుశలముగ బ్రపంచించిన కోవిదుండ!
తృప్తి పడు మింతతో నైన, తేటుకొనెదు.

కామ మైరేయ మత్తముల్ కనులు - ప్రేమ
శబ్ద మాత్ర ముఖరము లాస్యమ్ము - లట్టి
వారి కీవు తోడన్న భావ ముదయింప
కుంట నీ "తోడు" నంచు వాకొంటి నాడు.

నీ ప్రవాస దినమ్ముల నీ మనమ్ము
నన్ను "అర్ధాంగి"గా జేసికొన్న మానె!
అలత, వలవంత పాలయి - ఆ సగమ్ము
తనువు దక్కించుకొనదె? స్వార్థమ్ము కలిమి.

అకలుష స్నేహమున ప్రణయ ప్రదీప
ముజ్జ్వలించిన బ్రహ్మాండ ముత్సహించు;
కాని కాంక్షయన్ గొడి గట్టె నేని, నణువు
నణువు గానక, విలయాంధ్యమై నశించు.

ఏమి? చెలికాడ! పురుష ప్రకృతి యుగమ్ము
మధ్యమున వ్రేల బోని ప్రేమ ప్రసూన
దామమున కీ సఖీ గళ సీమయే ల
భించె నౌకా!" యంచు పెడ మోము పెట్టి, ఆమె -

పోవ నుంకించె - నేను నా పుణ్యశీల
కాళులకు నడ్డ మేగి గద్గదిక తోడ
“అమ్మ! నన్ను క్షమింపుమా ” యంటి - నామె
కరము నంటగ నిచ్చె - మేల్కాంటి నంత.

మఱల చిందులు ద్రొక్కు తమస్సె! కా
స్వప్న దృశ్యమ్మదింకను జాఱ లేదు;
దీప మాఱిన నైన తద్దీప్తి మీఱి
తాకి గోళాల దళతళ లాడు గాదె!

# మ్రొక్కుబడి

నవ మాసంబుల గర్భిణీ హరిణ మన్నా! కొట్టగా బొంచితా
వవు! భారాలస వేగమై కలగుచుంటం గాదె! నీ మ్రోల గ
న్గవ తేలంబడ నిల్చె - ఈ నిముస మేగన్ శాబకో పేతమౌ
ఎవరన్నా! విలు డింపు; మా బదులు నేనే మ్రొక్కు చెల్లించెదన్

క్రూర మృగమ్ము గాదు - కనుగోదు నినుం బరుషంపు జూపులన్
కోలలు నూరి విం గఱవ “గోంద్రు” మనంగను రా - దదేమిరా?
మారెదు పండ్లు దానివయి - నూరిన నూరెదు గాక! వింటితో
నారసమున్ బిగించి జతనంబున నారివి లాగుచుంటివా?

ఆకలి నీకె యున్న మృగయాపరతం గయిపెక్కి దాని నీ
వాకుల పెట్టెదో! వనుల యందలి నీరము జూచి కూడ నిం
కే కఠినుండు పాల్పడెదు హింసకు? పొట్టను నింపుకొంటకుఁ
శాకము లేదె మాంసమె మజా యొనరించునొ! పుష్టి నించునో!

ఇన్నిటి కేమి! నిన్ను నెవడే దెగ గోయ దలంచె - నొప్పెదో?
తన్నిక చత్తువే మృతి పదంబన; నా మృగ బాధ యేమిలే
యన్నటు లుండెనా? యసువులన్నవి దానికి గూడ నున్నవో
యన్న! యెడంద రాయివలెనైన వచింప బనేమి లేవయా!

ఇది విని చూడు మోయి! యొకపే యొక మాట వచింతు! మానవా
భ్యుదయము మంటిపాలగు నయో! అభిచారము చేత; స్వేచ్ఛగా
బ్రదుకు మృగాళియుఁ, విహగరాజియు, మానవ జీవితంబులో
నొదవని శాంతి, స్థాయి గల; వుగ్రత మాని గ్రహింపు సత్యముఁ.

## అంపకపు పెండ్లికూతురు

అమె నా సహ పాఠిని, అమృత హృదయ,
సదమల స్నేహ కూలంకష స్రవంతి,
శైశవ విముగ్ధ లీలా నిషక్త విద్యు
దుజ్జ్వల స్మృతి చిహ్న, మభ్యుదయ వాణి;

పేశల మధూక పుష్ప సంకాశ వామ
గండభాగ సమంచిత కజ్జలాంక
యగుచు నాయమ యత్తింటి కరుగు చుండ,
నే విలక్ష విలోకుడ నిలిచి యుంటి!

గౌరి కల్యాణ గీతికి, నారజంపు
వావి వరుసల పాట, కుత్పన్నములగు
హర్ష బాష్ప కణమ్ముల నంపకంపు
పాట శోకాక్తములుగ మార్పుచు నవుర!

చెఱగు నిండిన యొడిబ్రాల బరువుతో బ్రి
యాంతికమ్మున గూర్చుంటివమ్మ! జోడు
ఎడ్ల చిఱు గంటల రవమ్ము లెసక మెసగ
గదలె మీ బండి - గుండెలు గదలె మాకు!

"పోయి వచ్చెద" నన్న చూపుల వెలార్చి
సాగితివి చెల్లి! దూర దేశమున - కయిన
సౌఖ శాయనికత్వ విచారణమ్ము
లంత రంగమ్ములకు దప్పునా? సుశీల!

# పేద చావు

సౌఖ్య సంధాయ కామూల్య సౌధములును,
జీవనాధార సార సుక్షేత్రములును,
వాని కబ్బెడు జాడలు కానరావు;
నిజ సతీ సుతు లల్ల యన్నిటికి సమము:

మలినము గాని ప్రేమమున మాగిన దామె యెడంద, స్వర్గ షం
డల సుఖ మాధురిం గర పుటమ్ముల నింపదొ! చిన్నవాని బు
గ్గల కులికింపు సౌరు బ్రతుకం దెరువుం గనిపెట్టదో! మతెం
దులకు? తదీయ జీవిత వినూతన యాన మెఱుంగ డెవ్వడుఁ.

హితవు దలంప బోని పొరుగిండ్లు బలోన్నతి నాగృహ మ్మధః
పతితముగా నొనర్చెడిని! పాపము! దైవము దృష్టి కింత తా
నితరుడయొ నటన్న ఉగయే కలలో స్ఫురియించె నేని, పి
ల్లతనము నందె జీవ లతలం దెగ ద్రెంపడె? యిప్పు డెట్లగుఁ?

అల్లన లోక బాంధవు డహంకృతి లేశము లేక, యిద్ది పూ
రిల్లను సంశయంబును వహింపక, పాదము లెల్ల జాచె; వా
డుల్లముతో మెలంగు తన యుగ్మలి నంతట మేలు కొల్పి, సొం
పిల్లు నిసుంగు బుగ్గలను మెల్లగ ముద్దు గొనెఁ ద్రుతాత్ముడై.

తనకు గల్గిన దేదొ భోజన మొనర్చి,
నాతి యానతి దల యూపుననె గ్రహించి,

కన్ను దోయిని ఇంట - నక్కడనె - నిలుపు
కొనుచు నత డేగె నానాటి కూలి పనికి;

వారిద ఖండ మొక్కటి నభంబున గ్రిందల గాగ వ్రేలు - నె
వ్వారల గుండెలో పిడుగు బండలు వేయ దలంచు కొన్నదో!
ఱాఱెడు మించులుఁ గనుల చాయలకుఁ మసి బూయుచున్న - వా
సారము కుండ పోత గతి సాగుచు నున్న దగమ్య ధోరణిఁ,

భార్యయుం బాప డింటిలో బండి యుండ
వారిపై గప్పి వైచె నవ్వాని గృహము
కఱకు చలి గాన మృద్భిత్తికా పటమ్ము;
తెలియరో వారు దీర్ఘ నిద్రఁ, నిక్కైన!

కొంప మునింగి పోయినది। కూలికి బోయిన యాత డేడి? తే
లింపుల నుండె వర్షము; - చలిం దిగమ్రింగుచు వచ్చినా డదే
కొంపకు - పాడు కన్ను లవిగో। యొక దృశ్యము గాంచె - తుంప్ర రే
చెంపను నార్చ లేదు - మఱచెం బ్రియ చంచలతానుబంధముఁ,

“కనులవి యెప్పటట్ల” యని కన్నదెవండట! “హా యటన్న” ని
స్వనమున బోలె వాడు! త దసహ్య నినాదము మేఘ గర్జనం
బున నణగాఱె - సోగ మెఱపుల్ తమలోనికి బ్రాణ వాయువుల్
గొని, పరువెత్తి పోయినవి - లోకము చల్లవడంగ నయ్యెలే!

# సాహచర్యము

"అరుణు డుదయించె, శీర్ణ పర్యంక తలము
విడువ వేమి? తలాడ యొత్తిడికి జెంప
పైని దీరిన రేకలు పాయ దుడువ
వేమి? ఓ కవీ! చనునె నీ కింత మంపు?

పులుగు నెలతుక లుదయ గీతులను బాడ
దొడగె; మేల్కొన వేమి? యీ కడచిన వి:
నేదో స్వాప్నిక పీడ నిన్నేచె నొక్కొ!
ఇంత కుంచితాధరుడవౌ టేమి టోయి!

లేక యిది భావ బంధమా? నాకు దెలియ
రాక యున్నది కవి కుమారా? సుబోధ
కమ్ముగా విప్పి చెప్పని కతన నిన్ను
నిసడించు లఘు మనస్వి నేమొ కాను.

ఎంత పిలిచిన బల్కవేమి? అదేమి?
మేలుకొని యుండియే మతకాల కోడి
గమ్ము చేయుచు నుంటివా? కాక తావ
కార్ధ మీలిత నయన గతార్థ మేమి?

ఈ దినమ్మున నేదో యూహింపరాని
హృదయ వేదన మబ్బుగా వదనసీమ

నేలెలే! తద్విలోల శంపా లతాళి
నా విలోకన పదవి నాంధ్యమ్ము జిమ్మ.

నగ్న విరహాతిరేక చింతా భరమ్మొ!
స్వాదు వస్తు హతాశా విషాద భరమొ!
సంసరణ భార వికృత విచార భరమొ!
విన దగనె నేను నీ నోట? వినయ శీల!"

అనుచు నొక్క- దయాశాలి యనుగు కవిని
దట్టి లేపెను - కవియును తనదు కంటి
తెప్ప లటులనె మెల్లగా దెప్పరిల్లి
లేచి, కూర్చుండె ప్రన్నని లేపు పైని.

దీర్ఘ నిశ్వాసముం బుచ్చి దిన్న నైన
మెలుగుతో బల్కె- నిటుల "సహృదయ మౌళి!
వించునే యుంటి చెవులిచ్చి విరతి లేని
వీ ప్రబోధము; నేమని నే వచింతు?

నగ్న విరహాతిరేక చింతా భరమ్మొ!
స్వాదు వస్తు హతాశా విషాద భరమొ!
సంసరణ భార వికృత విచార భరమొ!
కాదు - నేడు నిరాకృతి ఖేద భరమె!

దుర్భరమ్మది! - లోకమ్ము దూసి పోయు
వీసడింపుల సేసల కీ శిరమ్ము
వంగి క్రుంగుచు నున్నది అంగరాజు
రథము శాపాహతిం బలె; ప్రాపికేది?

ఈ విశాల విశ్వమ్మున నెలయుచున్న
ప్రాణులన్నింటి సంతృప్తి పఱుపలేని
జన్మ మెత్తిన నన్ను నే జప్పరించు
కొనుచు ముసుగిడి యొకమూల గునుకు చుంటి!

భావ బంధమ్మదేమి? వాగ్బంధనమ్మె
కోరి నేనయి తగిలించు కొనగ నుంటి!
నంత నొకవింత దైన్యంపు టశ్వ గతి నె
టో యదుగువాడ; వసివాఱు సేయు నెవడు?

కవియు మర్త్యుడే కద! వాని కావ్య వస్తు
వులను గావలె నంచు ముక్కలుగ దఱిగి
ఏరొ గాలి కెత్తగ గని, యెట్టు లెడద
తఱుగుకొని పోవ శూన్యావ మఱుగ కుండు?

గుణమె యగుణమ్ము గాగ, నగుణమె గుణము
గాగ. బింబించ నేల జగత్ప్రవృత్తి?
"నాకృతులు దర్పణమున సవ్యాపసవ్య
విశద పరివర్తనము వొందవే" యటనెదో!

అనిన విని కోవిదుండగు నతడు నిందు
టాదరమ్ము దొలంక నిట్లనియె "మంచి
దో[illegible] కవి! యొకరి మెప్పుల కూపిరేని
నాధి వెట్టు మనంగ నట్లాచరింతొ?

ఎంత పొరపడినావు! కాసింత నీకు
మనసు జివ్వనగా నభిమాన శూన్య
భావ ఫణ మెత్తి నిరత శోభా మనోజ్ఞ
విశ్వ కళ్యాణి గాటంద వెడలి నావు!

కటిక చీకటిలో దీపకాంతు లతిశ
యిల్లు; గావ్య గుణములు శోభిల్లు నట్లె;
నెఱసు తా లెత్తకే గట్టి నిలుచు టెట్లు?
వ్రేలు వంకర సేయక వెన్న యెట్లు?

నీ వెఱుంగవె? నిష్కామ నియమ గాన
దృఢ తపోధనులౌ పరభృత కుమార
కులను? పర నిర్వృతి మరీచి తళుకు మనెడు
సుప్రయోజనమే కవి చూడ వలయు!

కవులు! మీ విధి మీది! స్వర్గమ్ము కాని
స్వర్గమున, స్వప్న వీధుల, సంచరించి
చవులు దీర్చెడు నమృత రసాయనమ్ము
దిగుమతి యొనర్చి మాకు నందింప వలయు!

ప్రకృతి వనిలో వయాళించి రకరకంపు
వలపు తేనియ లూరు పూవులను జిదిమి,
వాని నవతంసములుగ నర్పణము సేయ -
దరలి రం; దేము చెవులొగ్గ దలచి నాము;

వికచ విచికిల గానమ్ము, సకల తార
కా మనోహర గానమ్ము. గాలి తరగ
లందు దేలుచు మీ శ్రవణాంతరాంత
రముల నినదించు గాంధర్వ రసికు లీరు!

ఐన నొకమాట! యువ కవీ! అంతు లేని
మీ నిరంకుశ పాలన మేళవింతు
రనుదు కొంత ప్రజాస్వామ్య - మప్పు డీరు
బోద్ధ! లంతకు శ్రోతలు పొరలి రారొ?

ఇనకరా యోగ వికసిత వనజ గర్భ
విహరమాణాళిపీ ధ్వనుల్ వినగ బడునె
తత్సరోజాస్య ముకుళన తత్పరునకు?
సృష్టి లోనిదె కద! యీ విశేష సరణి.

ఏమొ చెప్పితి - తుదకు నీ యిష్టమునకు
నాదు చట్టము శోడించి నైజ ఫణితి
భగ్న మొనరింప నాకేల? పాడ గలవు
నీవు - నే నెఱుంగుదు - నిన్ను నీ వెఱుగవు.

వివరణోత్సేక శూన్య జిహ్వాకము, యైన
నిర్వికల భావ ఫలకము నీ ముఖమ్ము!
గడప గడపకు బంచి రాగలదె జలధి?
గుప్త మణు లెల్లొ సుకృతులు గొందురన్న!"

అనుచు కవి మూపు పైని జల్లని కరమ్ము
నునిచె నాతడు - కవియును నునిచె నట్లు -
ఆ మగులు గోడపై రెండు రామ చిలుక
లఱచె - నవ్వుకొన్నారు వారచటి కేగి.

## రాధా ప్రసాదనము

[బృందావనిలో కృష్ణుని కొఱకై వేచి వేచి, ప్రణయ కోపంతో పలుకకుండ ఉంటుంది రాధ - ఆమెను దరిసి అనునయిస్తాడు ఆ రసిక ప్రభువు.]

ఈ మలు సంజ నిగ్గులు సఖీ! భవదీయ నిసర్గ శోభచే,
లేమిని బొందినట్లు సకలేశ - కనుచీకటి యావరించె నా
రామము - నింక నేమిటి కరాళ గతిశ, శిధిలీ కృతమ్ముగా
నా మనముం గలంచెదవు? న్యాయ్యమె మూక విహార మియ్యెడశ?

గన్నెరు పూల మాలికను కంఠమునం గయిసేయ బోవ, నీ
కన్నులతో నదల్చి విముఖత్వము జూపితి వేల? ప్రేమపుం